శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౭. { సర్వధారి. ఆశ్వయుజ-ఫాల్గుణములు } సంచిక ౪-౫.

## సౌ దా మి ని

త్రిలిఙ్గపత్రికలో (సం. ౩౭-౩ సంచిక) సౌదామని, సౌదామిని పదములనుగూర్చిన విమర్శనమునందు సౌదామనియే సంస్కృతశబ్దమనియు, 'నది తత్సమమై తెలుఁగున కేఁగానే సౌదామినియని వికృతవ్యవహారములో కుదురుకొనినది. పదముచివరగల ఇకారసాహచర్యముచే దానియందలి అత్వనికూడ ఇకారముగ మారినదని' వ్రాయబడినది. సుప్రసిద్ధనిఘంటువులను, సంస్కృతవాఙ్మయమును పరిశీలింప రెండు పదములును గలవని స్పష్టముగ దెలియుచున్నది. సౌదామినియందలి మార్పు ఆంధ్రమునఁగలిగిన మార్పుగాదు. భాషాశాస్త్ర మర్యాదలచేనేమి, వ్యుత్పత్తి వేఱుగనుండుటచేతనేమి, సౌదామినిపదము సంస్కృతమునసే స్థిరపడినది.

(1) అమరసింహుని నామలింగానుశాసనమున దిగ్వర్గమున (3.9) తటిత్సౌదామనీ విద్యుచ్చంచలాచపలాపిచ అని కలదు.

దీనికి భానుజిదీక్షిత వ్యాఖ్యానమున (బొంబాయి 1907 సం)
శ్వేతద్వీపః సుదామా-ఇతిత్రికాండశేషే. ఐరావతపర్యాయే-తేనైకదిక్
(4-3-112) ఇత్యణ్ - అన్ (6-4-167)
ఇతిప్రకృతి భావా ట్టిలోపాల్లోపౌ న భవతః
సుదామ్నాద్రిణా-ఇతివా సుదామాతుపుమాన్ వారిధరపర్వత
భేదయోః

సుదామ్నా మేఘే భవావా-సౌదామినీ త్యపపాఠః। సౌదామన్య ప్సరో భేదే తడిత్తద్భేదయోఃస్త్రియామ్.

ఇందువలన సౌదామినియనునది యపపాఠమని వ్రాయబడి నది. దీక్షితులవారి వ్యాఖ్యానమున నే శతహ్రదాపదవ్యాఖ్యానమున శతహ్రదాస్త్రియాంవజ్రే సౌదామిన్యాం చకీర్తితా యను శ్లోకపాఠ ముదహరింపబడినది.

(2) అమరమునకు మాహేశ్వరవ్యాఖ్యానమున (బొంబాయి నిర్ణయసాగర ముద్రణాలయమున 1907 లో ముద్రితము)

సౌదామినీ విద్యుత్ చంచలాచపలాదశకం విద్యుల్లతాయాః- చపలాపిచేతిపాఠః (పుట 17)

(3) క్షీరస్వామి వ్యాఖ్యానమున (Oriental Book Agency 1941 Edited by Dr Har Dutt Sharma and Sardesai) అమరమూలము సౌదామినియనియే ముద్రితము - వ్యాఖ్యానమున సుదామ్నాద్రిణైకదిక్ సౌదామని తేనైకదిక్-ఇత్యణ్-(4-3-112) అని వ్రాయబడినది.

(4)తిరువనంతపురమున ప్రకటింపబడిన వంధ్యఘుటీయ సర్వానందుని యమరటీకాసర్వస్వమున సౌదామినీత్యపపాఠః। తథాచ హారి ప్రబోధ యమకమ్.

క్షేంతంబగాను కాంచవపసరన పుసౌదామనీలతా ధామా స్తమ్
కేవలయు మివసరజన్సరన పుసౌదామనీలతా ధామా స్తమ్
అను శ్లోకము సాహృతము.

(5) అనూశివరస్వతి తిరువేంకటాచార్యులవారిచే పరిష్కృత మగు గురుబాల ప్రబోధికయందు

'సౌదామినీ (మూలము)

వ్యాఖ్యా సుదామ్నా ఐరావతేన సహచర్తత ఇతి సౌదామినీ ఇచ్చట సౌదామనీ అనియు పాఠముగలదు.'

పై వానివలన నమరమూలమున సౌదామినియను పాఠముగూడ గలదనియు, గొందఱు వ్యాఖ్యాతలు దాని నపపాఠముగ గైకొని రనియు నిర్వివాదాంశము. ఇఁక మిగిలిన నిఘంటువులఁ బరిశీలింతము.

(6) వాచస్పత్యము - సౌదామనీ- విద్యుతి - అప్సరోభేదేచ- ఐరావతరోమాషితి - అనునర్థముల నిచ్చుచు
తత్రైవపి అత్రోఽల్లోపే సౌదామిన్యత్యపి—శబ్దరత్నావళీ అని సౌదామ్నీ పదవ్యుత్పత్తిగూడ నిరూపించినది.

(7) శబ్దకల్పద్రుమమున—సౌదామనీ, సౌదామినీ, సౌదామ్నీ అను మూడుపదములును గలవు. అందు

సౌదామినీ-స్త్రీ-విద్యుత్-ఇత్యమరటీకా-
(౧-3-౬) యథాఋతుసంహారే (3-12)
వప్తం ధనుర్బలభిదో జలదోదరేషు
సౌదామినీస్ఫురతి నాద్యవియత్పతాకా
తడిద్భేదః - యథామహాభారతే (3-58-12)
తతోస్మరాజ తేభైమీ సర్వాభరణభూషితా

సఖిమధ్యేఽపవర్గ్యాంగీ విద్యుత్ సౌదామినీ యథా
అప్సరోభేదః ఇతి హేమచంద్రః—దేశవిశేషః ఇత్యజయః
సౌదామిన్నా—స్త్రీ సౌదామనీ ఇతి శబ్దరత్నావళీ

శబ్దకల్పద్రుమకారుని మతమున సౌదామిని పదముగలదనియు, దానికి కావ్యప్రయోగము లుదహరింపఁబడినవనియు స్పష్టము.

(8) కేశవకృత కల్పద్రుకోశః.

శమ్పా సౌదామనీ విద్యుచ్చంచలాచ శతహ్రదా
సౌదామినీ చ సౌదామ్నా హ్లాదినీచాశనిర్ద్వయోః
(బరోడాప్రతి పుట 396 శ్లో 154)

(9) మహేశ్వరసూరి - విశ్వకోశః

సౌదామిన్య ప్సరోభేదే తటిత్త ద్భేదయోరపి

సౌదామినీ-స్త్రీ - సౌదామిని యను నప్సరస, మెఱుపు - మెఱుపులో భేదము.

(10) శహాజీ - శబ్దరత్నసమన్వయ కోశమున (బరోడా ప్రతి) నయిదుస్థలముల సౌదామినీ ప్రశంసగలదు.

సౌదామిన్యాంచ ఖద్యోతే గదితా - పు 48-17 పంక్తి.
విద్యుత్ సౌదామినీ సంధ్యాః 153-13
శతహ్రదాశ్వింద్ర వజ్రీ సౌదామిన్యాంచ గద్యతే 179-12.
సౌదామిన్యాం స్త్రియాం విద్యుదప్సరోభేదయోరపి 207-19.
ఘనవల్లీ నిగదితా సౌదామిన్యాంవిశారదైః 312-9.

(11) ఇరుగపదండనాథుని నానార్థరత్నమాలయందు 1863 సంవత్సరమున మదరాసు వాణీవినోద ముద్రణాలయమున బ్రకటింపఁబడిన గ్రంథమున సౌదామిన్య ప్సరస్యపి—సౌదామినీ అనిముద్రితము.

ఇటీవల వావిళ్ల ప్రతియందు సౌదామన్యప్సరస్యపి యనియే ముద్రితము.

(12) అజయపాలకృత నానార్థసంగ్రహము (కలకత్తా సాహిత్యపరిషత్ప్రకటితము)

సౌదామినీ పురీభేదే చంచలాయాం ప్రకీర్తితా శ్లో. 652.

(13) సంస్కృత శబ్దార్థ కల్పతరువు —

సౌదామినీ — ఈ కారాంతస్త్రీయాం — అమరః — విద్యుత్ - మెఱుపు - ఆకారయుక్త మకారమధ్యాపి

(14) సర్వశబ్ద సంబోధిని.

సౌదామనీ, సౌదామినీ, సౌదామ్నీ అనుమూడు పదములని చ్చుచు సౌదామినీ పదమునకు దేశవిశేషమను నర్థమును గలదని తెలుపఁ బడినది.

(15) Wilson's Sanskrit Dictionary.

సౌదామినీ – (F) Lightning (2) one of the apsaras or nymphs of Swarga (3) a particular sort of lightning (4) a city so named.

Kittel's Canarese Dictionary యందును సౌదామిని – a particular kind of lightning — Lightning (మించు – మంగరాజ నిఘంటు Mr 43) also సౌదామని.

(16) Apte నిఘంటువు నీమూఁడుపదములనిచ్చి యర్థముల నిచ్చుటలో

Lightning – సౌదామన్యా కనకనికషస్నిగ్ధయాదర్శయోర్వీం – మేఘసందేశ – 37

సౌదామినీవ జలదోదరసంధిలీనా – Mk 1-35 Mal Madh 8-14

అని మృచ్ఛకటికమునను మాలతీమాధవమునను సౌదామినీ పదము ప్రయోగింపబడినదని యుదాహృతము.

ఇంత కావ్య ప్రయోగములజాలము.

పరిష్కర్తల మూర్ఖులచే గొన్ని కృతులయందు వేర్వేఱు పాఠములు గన్పడుచున్నవి. శబ్దకల్పద్రుమమున సౌదామినీ పదమున కుదాహరణముగ ఋతుసంహార, మహాభారత ప్రయోగములు చూపఁబడినవి.

(1) ఋతుసంహారము — (3-12).

వావిళ్ల వారి ప్రతియందును, మణిరాముని చంద్రికావ్యాఖ్యానమునందును (నిర్ణయసాగరప్రతి) సౌదామిని యనియేకలదు. వియతి ఆకాశస్య పతాకా సౌదామినీ తడిన్నస్ఫురతి నదీవ్యతి — మణిరామవ్యాఖ్య.

(2) మాలతీ మాధవము — (8-14)

పాత్రేణ బాంధవ సుహృత్ప్రియ సంగమాది సౌదామినీ స్ఫురణ చంచల మేవ సర్వమ్.

ఆప్టే దీని నిట్లే గైకొని యున్నాఁడు.

త్రిపురారి వ్యాఖ్యయందును 'సౌదామినీ స్ఫురణ వచ్చంచలమ్'

జగద్ధర వ్యాఖ్య – భవిష్య త్సౌదామినీ పార్శ్వ గమనస్యసూచనేన.

జీవానంద విద్యాసాగరునిచే కలకత్తాలో ముద్రింపఁబడిన 1876 సంవత్సర ప్రతియందును సౌదామినీ యనియే ముద్రితము – కాళేపండితుని పంస్కరణమున మూలమున సౌదామనియు, వ్యాఖ్యయందు సౌదామినియు గలదు.

(3) మృచ్ఛకటికము (V. G. Paranjpe's Edition 1937)

సౌదామినీవ జలదోదర సంధిలీనా. మృచ్ఛ – 1-35

నిర్ణయసాగర ప్రతియందు

సౌదామనీవ జలదోదర సంనిరుద్ధా యను పాఠాంతరము ముద్రితము.

(4) భర్తృహరి వైరాగ్యపద్ధతి – శ్లో॥ 36,

భోగా మేఘవితానమధ్య విలస త్సౌదామినీ చంచలాః

అని వావిళ్లవారి ప్రతులయందును, 1928 సంవత్సరమున ముద్రితమగు నిర్ణయ సాగరప్రతియందును, డి. డి. కోశాంబి పండితునిచే భారతీయ విద్యాభవన ముద్రితగ్రంథము (1946) నందును సౌదామినియే గలదు. సౌదామనీ పాఠాంతరముని చూపబడినది.

రామచంద్ర బుధేంద్రవ్యాఖ్యానము కొన్నిప్రతుల సౌదామనియే గ్రహింపబడినది.

(5) కాళిదాసుని మేఘసందేశమున (శ్లో 37)

సౌదామన్యా కనకనికషస్నిగ్ధయా దర్శయోర్వీయనుచో మల్లినాథుని వ్యాఖ్యయందు సౌదామనియే మూలమని స్వీకరింపబడినది.

1941 (Paranjpe's edition) స్థిరదేవవ్యాఖ్య.

సౌదామిన్యా — స్నిగ్ధయా సౌదామిన్యా ఉర్వీంపర్శయ – సౌదామిన్యా విద్యుతా

పరిషద్భాండాగారమునందలి (4676) సంఖ్యగల యొక ప్రాచీన ప్రతియందును 1947 సంవత్సరమున ముద్రింపబడిన నిర్ణయసాగర ప్రతియందును 'సౌదామిన్యా' అనియే ముద్రితము.

Nandarigikar's edition (1894) Verse 41-సౌదామిన్యా for సౌదామన్యా in Wilson's edition and Manuscripts G, $G_2$ K, $K_2$ R & M.

అని పాఠాంతరముగల ప్రతులు వివరింపబడినవి. దక్షిణావర్తనాథునిప్రదీప వ్యాఖ్యానమున సౌదామన్యా యనియేగలదు.

(6) శబ్దకల్పద్రుమమున నుదహరింపబడిన మహాభారత ప్రయోగమునకు (3-53-12)

నీలకంఠ వ్యాఖ్యయందు సౌదామని యని వ్యాఖ్యానింపబడుట యేగాక పాఠ్యపేక్ష్య మేఘ సంబంధీయనియర్థముకూడ వివరింపబడినది.

సౌదామనీ = ప్రావృషేణ్యమేఘ సంబంధినీ = సుష్టుజగతో జీవనం దదతి తేసుదామానో మేఘాః. తేషాం సమూహః సౌదామనీః ప్రావృట్కాల స్తత్సంబంధినీ సాహి అత్యంతద్యోతమానో భవతీతి తత్ప్రసిద్ధమ్ —

పైనవివరింపఁబడిన నిఘంటుకావ్యప్రయోగాదులవలన సౌదామిని పదమునుగూడ సంస్కృతనైఘంటికులు తమ తమ నిఘంటువుల జూపించిరనుట స్పష్టము. అర్థ వివరణమున 'దేశవిశేషము' పట్టణవిశేషమనియు విశేషార్థము నొసంగిరి.

కాని వ్యుత్పత్త్యర్థమును విచారించుచో కేవలపాణినీయ సూత్రముల మాత్రమాధారముగ గైకొనుట యొప్పదు. పెక్కుపదములపాణినీయములయ్యు నితరవ్యాకరణముల నవర్థింపఁబడినవి. ముష్టాముష్టి అక్షౌహిణి మున్నగునవి. శాకటాయన వ్యాకరణమున 'ప్రజ్ఞా పర్ణోదక ఫేనాల్లేలౌ' యను సూత్రమున (386) మత్వర్థమున పర్ణలః, పర్ణిలః—ఉదకలః, ఉదకిలః — ఫేనలః, ఫేనిలః = ప్రజ్ఞాలః, ప్రజ్ఞిలః మొదలగు రూపాంతరములు జూపఁబడినవి. మఱియు సికతిలః, శర్కరిలః అనునవి ఇలశ్చదేశే అనుసూత్రమున (392) నుదాహృతములు. పదములకు రూపాంతరములవ్యవ్యాకరణసాహచర్యముచే గల్గినను గలుగవచ్చును. శబ్దశాస్త్ర పండితులిట్టివానిని భాషాశాస్త్ర మర్యాదలవలన (Philological Principles) గలిగినవని నిర్ధారణ చేసినట్లుయు గలదు.

అయినను సౌదామినీ శబ్దమును పాణిని సూత్రములవలన గూడ సాధింపవచ్చునేమో. సుదామా శబ్దమును వదలిన

సంజ్ఞాయాంమన్మాభ్యామ్ అను పాణిని సూత్రము వలన (5-2-137) దామినీ, హామినీ, సోమినీపదములు సాధువులే. దీనివలన సుదామినీ శబ్దమును సంబంధార్థమున సౌదామినియు నిష్పన్నమగునని తోఁచుచున్నది. ఇందులకు విజ్ఞులగు వైయాకరణులే ప్రమాణము.

ఆ॥ సా॥ ప॥ సం॥

## (4) చిమ్మపూడి అమరేశ్వరుడు—విక్రమసేనము.

సీ. సారథి శతవృద్ధు చక్రింబు లోఁగూడి
జరగవు రథమున సంఘటించి
యుదకంబుసోఁకున కోర్వనియురజంబు
చేతికి బిఱుసైన జాలివిల్లు
కరితాఁకున కోర్వక గడగడవడఁకుచు
ముప్వంకివోయెడి చివ్వనారి
మేఁపు నీరును లేక మెదలాడనోపక
వర్ణహీనం బైనవారువములు
నిట్టిసాధనములు నీకు నెట్టులోదవె
దిరిపురముల నెట్లు గెలిచితి దేవదేవ
యనుమ నగజాత చెలులాడ నలరు శివుఁడు
చిత్త మిగురొత్త మనల రక్షించుఁగాత. 1

చం. చనవున రెండువక్త్రములు చన్నులపా ల్గుడువంగ నొక్కవా
ము నగఁగ నొక్కయాననము ముద్దుపటింపఁగ నొక్కయాస్యము
న్గనఁగ నిదేమి పల్కెదని యాలపనంబునఁ జెక్కిలించు ను
బ్బున నగుషణ్ముఖుం డెమిఁ బొంది త్రిశక్తులు మాకు నీవుతన్.

సీ. భట్టనారాయణుభాషారమాదేవి
లబ్ధవర్ణులకర్థలబ్ధిఁ జేయు
బాణవాగ్భామినీప్రసవమంజరి విశా
రదుల కలంకారరమణిఁ జేయు
రాజశేఖరభారతీజహ్ను కన్యక
సుకవీంద్రులకు భావశుద్ధిఁ జేయు
మాఘువాణీశీతమారుతగతి సార
సుకవులకు రోమోద్గమంబుఁ జేయు

నని యెఱింగి వారియడుగులు దలఁచి న
మస్కరించి దండి నమ్మురారి
వామనుని గుణాఢ్యుక్షేమేంద్రు నిల
నలంకారవిదులఁ దలఁచి గౌరవమున.

సీ. ప్రత్యగ్ర రచనాతి భాసురప్రాసాద
నిర్జిత గోత్రాగ్ర సిఖరంబు
ప్రాకార శిఖరాగ్ర బంధుర మణిగణ
ద్విగుణిత తారకా విభ్రమంబు
పరిఖాజలాంతర ప్రతిబింబితద్రుమ
స్మారిత పాతాళ భూరుహంబు
వరపుష్ప సౌరభావర్జిత మధుప శరా
స్వీకృతాశా వారణేంద్ర గండ
మప్సరః స్పృహణీయ లీలాతిశయవి
లాసినీజననేత్ర విలాస జనిత
కుసుమ శర బాణవైఫల్యమసదృశార్థ
నిర్జితాలక యుజ్జయినీపురంబు.

తే. గీ. తరులుపడి యుత్తరాయణ దక్షిణాయ
నములఁ రవి తేర నిడిసిన పరవలట్లు
మెఱయుఁ గనుఁగొనఁ గొమ్మలు మింటి కిడిన
కుదురువిధమునఁ జనరారుఁ గోటమీఁద.

చం. కొలఁదికిమీఱఁ బెద్దయగు కోట తనర్చున వస్తుసంతతో
జ్వలతరసత్ప్రభా తరవి చంద్రరుచుల్ సొరనేరకున్న సం
ధ్యలు దివసత్రియామములు తత్పురిపౌరజనం బెఱుంగుఁద
న్మిత్రలమీఁచవిన్ విహంగగతిఁ బూవులతావి రతిప్రసంగతిన్.

తే. గీ. ఇట్టిపాప యిల్కుఁ దేలుపట్టియనుచు
జనులు కనుకని పలికెడు చందమామ
నడిమి మచ్చకు నెఱిఁగి పేరిడఁగ నేర్తు
రప్పురమున మేడలపయి నాడునతులు.

కం. హారగిరి సురగిరి రోహణ
గిరులీనిన కొదమలనఁగ గృహములు పురిన
చ్చెరువగు నకుప్య రత్న
స్ఫురణల విలసిల్లి తగినపాదపుల తోడన్.

ఆ. వె. నీర నగ్నిమునికి యారయ విస్మయం
బనుచు బాడబాగ్ని కడలి యుప్పు
రంబు సొచ్చనొక్కొ రత్నాకరము మణు
లనఁగఁ జెలువమమరు నాపణములు.

చం. పొడవుగ నెల్లయంగడులఁ బోఁగులువోసిన నూత్నరత్నముల్
కడఁక ననేకదేశములు గైకొనివచ్చిన యర్థికోటికిం
బిడికెడు లాదిగాఁగ బలివెట్టుదు రప్పురివైశ్యభామినుల్
గడపక హస్తకంకణ ఝుళంధ్వనులొప్పఁగ నెల్ల యెప్పుడున్.

కం. తరుణ వయస్కుల యావన
పరిపాకుల వృద్ధజనుల భటులను నిజసో
దరులను గురులనుగాఁ జూ
తురు పురముపతివ్రతాసతులు పుణ్యవతుల్.

సీ. చూపుల కట్టువుందూపుల చేఁబట్టు
నబలల చూడ్కుల యాయుధములు
తాయంబునకు గండఁగోయిలఁ గూయించు
బాలలపలుకుల మేలమంత్రి

మొదిరికిఁ దేటులనెడ యాటలాడించు
సబలలయలకల యాప్తబలము
వవరణకుం జంద్రుఁ జాలించు మగువల
మొగముల సేవకుఁ దగిన మొగము
భావ భవునకు నటుగాక బలమె బలము
గాఁగఁ దిరిగనే వీటిచేఁ గాసిబడఁడె
యనగ సౌందర్యసంపద లభినవముగ
వఱలుచురు దత్పురంబున వారసతులు.

ఉ. పూవులపోఁ్రవులై చిలుకబోదలు కోయిలపిండు మంధలై
తావులకోఁ్రవులై యలివితానముగానము తానకంబునై
తావను బండఁజాలుటఁ ద్రితాలముగల్గ వరంబుఁగన్నయ
ట్లై వనరాజిపొల్పుఁగఁ బురాంతిక భూములనెల్లఁ జూడగన్. 13

చం. మరలఁగఁబోదు రిండ్లకును మాపవునంతకుఁ జేలలోపలం
దిరిగి రొంకిం తలేఁ తవడఁదేరెకు మోముఁ జెన్ను సేయుచున్
బిరిగొని శాలిలు ద్మగ్రుచులు పెల్లుసఁజేకటినెల్లఁ బాదినం
దెరువరు లక్ష్మిఁగూడఁ బల సేరఁగఁ బామర భామినీజనుల్. 14

సీ. సుదతులు దస్సినచో నలంతులువోవ
సొబగుఁలై చలియిరి చూపిచూపి
యువతులు తిలకించియున్నచో వేడుక
గొలఁదిమీరఁగ నొజ్జ గుదిసి కుదిసి
సుభగుల పెనకువచోఁ దానవలఁతిరై
మొలుకువ వాసన కెక్కి యెక్కి
వెలఁదులు ముదమునవిహరించుచో సోయ
గంబున పీథులఁ గ్రాలి క్రాలి

యుతులిరంబైన శృంగార రతుల నిజని
భూతిఁ బొందానసేసి తత్పురములోనఁ
బవలుఁ రేయును నుడుగక తవిలి తిరుగు
మిండఁడును బోల మందానిలుండులీల. 15

శా. దానానేకపబృంహితస్వనము గాంధర్వావలీహేషిత
ధ్వానంబున్ మృదువేదనాదమును గాంతానూపురారావమున్
గానానూనరవంబుఁదూర్యబహుశంఖస్వానశబ్దంబుఁ బె
ల్లై నీరాకరఘోషమై తనరఁగ నిత్యంబుం జెలంగుంబురిన్. 16

తే. గీ. నూఱు క్రతువులు సేయని పాఱుటిల్లుఁ
గోటిపడగలు లేని కిరాటగృహము
జాతిరత్నంబు గాని పాషాణకులము
వెదకిచూపిన వీటఁ బన్నిదము గలదు. 17

మ. కులశైలంబులలో సువర్ణగిరి దిక్కుంభీంద్రవర్గంబులో
బలభిన్నాగము, లోకపాలకులలోఁ బర్జన్యుఁ డుగ్రోరగం
బులలో శేషుఁడు పెంపుగన్న కరణిం బూజ్యాధిపశ్రేణిలో
వెలసెన్ విక్రమసేనభూవిభుఁడు దోర్వీర్యప్రకాశోన్నతిన్. 18

సీ. ధరణీశ లవణాబ్ధి పరివేష్టితక్షితి
వరలిన నేరెడు గటికి కోలఁది
నొక్కొక్క దిక్కున నొక్కొక్క లక్ష యో
జనములు తన్మధ్యమున సువర్ణ
సారమై యున్నది చతురుత్తరాశీతి
సాహస్ర యోజనసంఖ్య మొదలి
వలము పదాఱు వేల్గలిగి వెడల్పు ము
వ్వదిరెండువేలుఁగాఁ బాతలోఁతు

మొదలి వలయమున యంత్రమై తుదిఁ బదాలు
సేసి వెలుఁగారు మేరువన్ శిఖరి యొప్పు
దానిపై బ్రహ్మపురి చతుర్దళ సహస్ర
యోజన స్థితిఁ గనుఁగొనఁ దేజరిల్లు. 19

మ. అద్రైశలాసనము దిగ్విలాసనము విహాయశ్చారిణీపద్మద
పరిదవిన్యాస ముదగ్రభాసము మరుద్భ్యాభూపదాధ్యాస మ
భ్యుదయన్యాస మసన్నిరాసము మయూరోదారనిధ్యానభి
భ్యదహిమాద్రిశకృతప్రాసము త్రినేత్రాద్రివాస మర్క్యేశ్వరా. 20

శా. ముత్తాకే కుజముల్ వడల్చె, మొగడల్ ముగ్నె మహీజంబులం
దొత్తెంబుప్వులు నిండఁగాఁ బెరిఁగె నేయూర్వీజముల్, పూవలన్
మొత్తంబై విలసిల్లె నేధరణిజంబుల్, కాయలం బండులం
జిత్తానందముఁ జేర్చె నేక్షితిజముల్, చెల్వొందఁగాఁ జెప్పుమా. 21

సీ. అరుణ పుష్పావలి యగ్నిగా సంధించి
యళుల నుల్కలుగాఁగ నావహించి
దండడిపి తెంచు దక్షిణ పవనంబు
భస్త్రిలంబుగాఁ బరిభవించి
చిలుకలఁ బికములు చేదోడు సేయంగ
మాధవుండను కనుమరి గడంగి
యంగజుండను వతి యౌవతింబనిపూని
మొగడల నమ్మలుకుల మొనలు చఱచు
కొలిమి యొక్కయవఁగఁ గురియు కురాగంబు
విస్ఫులింగములుగ విరహు లులుక
నేచిపూచియున్న యీ యశోకమహీరు
హంబుఁ గంటె భూళివాధినాథ. 22

సీ. మదవతీగండూష మదిరాభిషేచన
వడినంకురించిన వకుళములును
అతివల మృదుపాదహతినూత్నకోరక
స్ఫురణ గైకొన్న యశోకములును
సుదతుల క్రీఁగంటి చూడ్కిపైఁ బాఱినఁ
దిలకించి యలరిన తిలకములును
అన్నుల యూర్పులఁ జన్నుల సోఁకునఁ
గొమరొంది పనిచిన కురవకములు
నెఱిఁగి చరణములను సెఱకలు విఱిసిన
మొగడలందునుండి మొరయు తేఁటి
కొదవు తెలమిఁబొంది ఘూర్ణిల్ల నధికవి
భూతిఁ దనరు చూతపోతములను. 23

సీ. పాంథుల హృదయముల్ వల్లటంబులుసేయ
దర్పకు పనిచిన దండనంగ
విరహిమృగంబుల మఱిగింపఁ దివిరెడు
కాయసంభవుని మొక్కల మనంగ
కడునల్గి చైత్రు నాగారంబు ముద్రింప
మనసిజు పనిచిన యనుఁగు లనఁగ
సహచరుండగు గంధవహుఁ గానఁగా
మీనకేతను పంచిన దూతలనఁగ
నభినవాకార సౌందర్య సుభగలీల
లతికయంబుగ మెలఁగుచు నసమబాణు
పుష్పలావికాజనములపోలె నెఱసి
కోమలాంగులు పువ్వులుగోసి కెలమి. 24

చం. ఇఱియఁగుచంబు లందొకటియుంచుక వీడ్వడ నొక్కకేలఁ
బొఱఁగ బళించి నిక్కమును బూవునకై త్రిపచేతి చంకఁ గ్రొ
మ్మెఱుఁగులు హస్తముంగడచి మీఁదికిఁ బ్రాఁకఁగ మిన్నుగన్నయా
గుఱుతులు డాసి కోసెఁ దుదికొమ్మలపూవులు కొమ్మ నెమ్మితోన్.

చం. అలకలు తేఁటిదాఁటులును, హస్తతలంబులు పల్లవంబులుం,
బలుకులు కీరపోతములభాషలు, మేనులు పువ్వుఁదీఁగెలున్,
లలిఁగనుమలోఁబడఁబడ, విలాసవతుల్ లక్ష్మనాథరాజ్యల
త్సుక్రలగతినల్లఁజొ విరులుఁగోయుట చెన్నసలారెఁ దోటలన్.

సీ. నెఱపుగావిరియక నెగడు నెత్తావి తు
మ్మెదలచే మునుమును మీఁదుపోక
అకరువు నెరయక మకరంద మొలుకక
నెఱినప్ప నొరుగక కఱకులేక
బింకఁబు లొక్కింత పిసికలక జిగిసొంపు
చెవరక రేకులు చిక్కువడక
పొరటతోఁ రాయక పొలుపు సొంపెడలక
సుడియు క్రొ గాలిచే సూరగిలక
కరముకోఁకల్లు రుధిర మంజరులఁగోసి
వనిత యొక్కర్తె తనదులావణ్య రసము
నెలమి నుద్యాన మొక క్రొత్త చెలువుదాల్ప
లతలలో నాడు జంగమ లతికవోలె. 27

---

సీ. దక్షిణపవనంబు తనుగంధమునపూని
మలయాచలముదాఁడి మరులుమూనఁ
దివిచిపట్టిన లేఁతచివురుల చాయకుఁ
గరతలంబులకాంతి వరములొసఁగఁ
గుసుమముల్ గోయుచో గోళ్ల మెఱుంగులు
తనిమొగ్గలకు గవుసెనియ లొసఁగఁ
బిలువంగఁజెలఁగెడు పలుకులు రాజకీ
రములకు నొజ్జతనములు సేయఁ
గురులు నలుఁపిండు బెరయఁగ వనమయూ
రముల గతులు వేడ గమనలీల
నవఁగిపెనఁగి ప్రీతి వనకేలి సలిపిరి
వనజముఖులు వేడ్కఁ బనుపుసేయ. 28

సీ. ధమ్మిల్లభారముల్ కమ్రపూవులతోడఁ
బాదిగొని వెన్నెలఁబోలసి వ్రేల
నలికతలంబులఁ బొలుచు కుంతలములు
ఘర్మజలంబులఁ గలసియుంట
గహ్లారదళముల కాంతిమిన్నక కొన్న
చెన్నునఁగనుఁగవ జేగుఱించ
ప్రోలెడు వల్లులఁబోలెడు మేనులఁ
బయ్యెట గ్లాని పరిస్ఫురింప
ఘనపయోధరముల కాశ్మీరచర్చలు
గలఁగ నలసగతులు చెలువమొందఁ
బువ్వుఁబోఁడులంతఁ బుష్పాపచయకేలి
సొలివచ్చిరా నృపాలుకడకు. 29

మ. పరఁగై యొప్పెసలారు మానికెపు సోపానంబులం బ్రజ్వల
ద్వర వజ్రోపల సైకతంబులను సౌవర్ణారవిందంబులన్
హరినీలాసితవారిజంబులను జక్రాంగాదివాఃపక్షివి
స్ఫురణంగల్గు సరోవరంబుఁగనియెన్ భూవల్లభుం డయ్యెడన్. 30

కం. మొగములు విరిదమ్ములఁ గుచ
యుగములు కోకములఁ జూడ్కు లుత్పలముల మం
దగతులు హంసలఁ దోల స
రుగుఁగెలిఁ జొచ్చిరి సతుల్ సరోవర మెలమిన్. 31

చం. కటివడఁ గాడ నీల్గ నసికొను కరంబుల నక్కలించి పి
న్నటి తరళంబుతోడ నయనద్యుతి భ్రూలతలందె ర్చ నుం
గుటములు కోడి నిక్కుచును గ్రొవ్విరిచన్నులచాయ మోవుచ
క్కటి కెనగంగఁ జొచ్చె నొకకామిని తోయజమండమిత్రులన్. 32

తే. గీ. బలిమిరాహు సుధాంశు బింబంబు వెఱచి
పాఱఁగడు దాసి వెనుకొనుపగిది నొక్క
యెడ సఖులుగూడి చెలరేఁగి యీఁదుచోట
నీలవేణిము మొగమును నెలఁతకొప్పె. 33

తే. గీ. సతులు చల్లుఁ బోరాడుచో జలకణములు
నెఱికురులమీఁదనిండి క్రిక్కిఱిసి చెలువ
మమరెఁ గనుగొన నింద్రనీలములతోడఁ
గలయఁగుచ్చిన మౌక్తికంబులను బోలె. 34

తే. గీ. క్రాలుఁగన్నులు ముద్దుమొగములుఁ దమకు
ననదృశప్రభావమునఁ జెల్వగుటఁ జేసి
మునిఁగిమీలను దలయెత్తి వనరుహములఁ
దూలకఱచిరి వనకేళివేళ సతులు. 35

తే. గీ. అలికలితపంకజము నొక్కయతివ దెచ్చి
చుట్టమగునట్టి వనితచేఁ జూపుటయును
తనకరులు మోము నెదుట వద్దంబు లేక
తోఁచెననుచు వయస్యర్థ యద్భుతముఁబొందె. 36

సీ. కేలిదెప్పముసేసి కాళ్లి లీలావతి
నీఁదించుచును నొక్కయింతిడాసి
చేయిచ్చి యిందు విశ్వేయముపంచును దన్వి
వడిపించుచును నొక్కపడఁతి నగాది
ముదితఁజేకూడను ముత్తలాడుచు నొక్క
తరుణికి నిమ్ములఁ దమ్మిరేకుపసఁగి
రమణిపాపటఁ బుష్పరజముఁ బోయుచు నిదె
మిగిలెఁ గొమ్మని రొంక్కమగువకిచ్చి

కదలఁబడినట్టు లొక్కతెఁ గాగలించి
ముంపుమునిఁగి వట్లొక్కతె మోవియాని
లలితనాయక కేలీవిలాస మమర
లీల జలకేలి సలిపె భూపాలసుతుఁడు. 37

సీ. కలయఁగ నలఁదిన కస్తూరి పెల్లున
జలములనెల్లను గలఁగఁజేసి
కుచమండలంబుల కుంకుమచర్చల
నీరెల్ల జేవురు నీరుసేసి
తనులిప్త సురభిచందన కర్దమంబున
వారినెల్లఁ బులకవండుసేసి
మూలల నవపుష్పమాలికావితతుల
వనమెల్లఁదెట్టువఁ గొనఁగఁజేసి

యలక లలితవీథినంటఁ గన్గవలఁగెం
వెలయఁ గామచిహ్నలెల్ల జెలయ
వలరువాకు లమర జలకేలి సాలించి
కొలను వెడలి రింతు లలసగతుల. 38

ఆ. వె. భూమినిండి మింటఁబూర్ణమై కర్కట
మకర మీనరాశి మహితమైన
హరియశస్సుధాబ్ధిముండుల తుంపురు
లనఁగఁ జుక్కలొప్పె నాకసమున. 39

సీ. ధర వియోగులనెల్లఁ బరిమార్పఁబూని హృ
ద్భవుఁడు గట్టిన వీరపట్టమనఁగ
విరహులపై దండువెడలుచో మదనున
కెత్తిన కెంజివ్వురెల్లి యనఁగ
కలిఁ బ్రోషితులమీఁద గొలిపెను మరుకరి
ఘుసృణపంకాంకిత కుంభమనఁగఁ
జొత్తిల్లఁ బథికులనెత్తుటఁ దోఁగిన
శంబరద్విషుచేతి చక్రమనఁగఁ
తూరుకొండ తుట్టతుదిమీఁదువున వేలు
గొమ్మవలుదపూవు గొలకవోలెఁ
గందుచెరసి రాగకాంతిదలిర్పంగ
మార్గమొప్పఁ జందమామ వొడిచె. 40

తే. గీ. అమరు లమృతాబ్ధిలోఁ బలి యమృతరసము
వెండిచేరుల పటికంపుకుండఁగట్టి
చేదుకొనిమొదరోనాఁగ శీతరోచి
మెల్లమెల్లన రుచులతో మిన్నువ్రాకె. 41

తే. గీ. తనరి రాగిల్లి ముక్తుడై తరతరంబ
నిర్మలత్వంబుఁ బొందుచు నీరజారి
పరమయోగియుఁబోలె సత్పథమునందు
నడువఁగాఁ జొచ్చెఁ గువలయానందమొసఁగ. 42

తే. గీ. ఉదయరాగ మించుంచక యుజ్జగించి
నిండఁ జందురుఁడు గన్నులపండువయ్యె
ధావనానంతర స్నిగ్ధదాక్షిణాత్య
రాజశుద్ధాంత దంతపఙ్క్తులకాంతి. 43

తే. గీ. కమలినీ కాంత మొంతయుఁ గంది వంద
వారుణీసక్తుఁడై వసువ్యయముచేసి
యరిగినట్లు పరాగియై యంబరంబుఁ
దొలఁగి పశ్చిమజలధిలో నణఁగెఁ దరణి. 44

క. తరుణుండగు శీతలకరు
మరగి వియల్లక్ష్మి తన్నుమూలి ముదుకడున్
ఖరకరుడును నని ద్రొబ్బిన
కరణిన్ రవి పశ్చిమాద్రికడఁ గ్రుంకె నృపా. 45

చం. నలువగు రక్తి మించినమనంబున నబ్బురులావుపుట్టి చెం
గలువవికాసవేళ ముకురంబు నటింపఁగఁ బువ్వుఁబోడి మొ
క్కలమునఁ జేర్చి నాథు నధికారముఁ గైకొని కేలిసల్పన
చ్ఛలమున సిగ్గుచాలమియుఁ జగ్గవహారము లోలిఁ జెప్పగన్. 46

తే. గీ. వామనానేకపము చక్రవాళ కంధర
ధాతుతటము గోరాడుచోఁ దరులువిఱిగి
కూలుటయు మింటి నెగసెడు ధూళిపోలెఁ
బర్వె నలసంజ పడమర పట్టుకొనుచు. 47

చం. అలరుల పాన్పులం దలిరుటాకుల సెజ్జల హర్మ్యవేదికా
తలముల దీవెయిండ్ల సికతాశయనంబుల మున్నియుక్తిమై
నలఁదురివండు కందువల నప్పటికప్పటి కింపుఁ బెంపఁగో
ర్కులు తనివారి వేడ్కఁబడఁగూడిరి వేడుకతోడ దంపతుల్. 48

చం. పలుచని చంద్రికారసము ప్రన్నని నున్నని కేటక్రొమ్ముఖుం
గులతుదలందలిర్చు నెలకొమ్ముల గాంతి పసిండివిగ్గుతోఁ
గలపి యుగలంతివన్నె యిడి కాయజునిల్పిన రత్నపుత్రిక
న్నలువ సజీవిఁజేసె నొకొనాఁ దగు నాతివిభాతి చూడ్కికిన్. 49

సీ. దళమైన చీఁకటి గుళికలుసేసి వ
ద్మాసనుం డాయువు వోసెనవఁగఁ
దోలుకారు మెఱుంగులు కోలదీఁకి వి
రించి వాల్గనుల నూరించెనవఁగఁ
చంద్రికాసార మబ్జజుఁడు గట్టిగఁ బద
నిడి యాణిపాణియుం బడసెనవఁగఁ
చాటించివిధిరాగ పరమాణువునఁ బల్ల
వితమూర్తిగాఁగ నిర్మించెనవఁగఁ
బొలుచు నలఁలను మదనునమ్ములను ముత్తి
యముల విద్యుల్మల్లిక నపహసించుఁ
దరుణియలకలుఁ జూడ్కులు దశనములును
నధరమును బ్రస్తుతింప నాకలవి యెట్లు. 50

చ. పరముఁడు కంధర స్థలముపై నిడి వేడుక ముద్దులాడఁ గాఁ
గరమున వాళిగంగయుదకంబులు మెల్లనఁబిల్చి యూఁది శీ
కరములు భూమిఁ జెందునకు (శారద) తారకలీలఁ జేయు త
త్కరివదనుండు మత్కృతికిఁ దాసుముఖస్థితితోడఁ దోడగున్. 51

చ. గొనయము తమిస్రనూల్ చెఱకుఁగోల ధనుర్లత పూవు లమ్ములే
టును నొకమాటు కావతనుడున్ మను నాగ్రజయించి జీవరా
శి నొడుచు లేమిచెప్పవని చేయునుతుల్ తగు మోహనప్రవ
ర్తన గల కాము డీవుత ముదంబున విూకిలఁగాము సౌఖ్యముల్. 52

సీ. పరిణత ఫణిలతావల్లి ఁబుఁ గడిసిన
చివురు నాఁ జెఱుకుఁ జేయిచేర్చి
కందర్పు మకరి కరముపై జక్కవ
లెఱగెనాఁ దొడఁగుచ బిల్తియు జూపి
దవనంబు పొరకలఁ గవిసిన మంచునాఁ
బలుచని చెమట పైఁ గలసి మెఱుఁగఁ
గలువ రేకులు మౌక్తికములఁ గనెడి నాఁ
గన్నుల బాష్పంపుఁ గణములురలఁ

గీ. వేడినిట్టూర్పు గాడ్పులు విరహవహ్ని
శిఖలు ప్రబలంగ వలవంతచింత నొగిలి
యేకతంబున్నదాని రాజేంద్రతనయుఁ
గనిరి లతికా గృహంబులో వనజముఖులు. 5

సీ. ప్రాణంబులెడల నభ్యాసంబు సేయు మా
ర్గంబన నిట్టూర్పు గాడ్పులెసఁగ
గవ్యశాలగ నేయి గ్రమ్మకై వడిఁ గామ
శిఖఁ గ్రాఁగి మైదీగ చెమటవాడమ
మదమున మమ్మలు నీరు పదను పెట్టినక్రియ
వాలుఁగన్నులు బాష్పవారి మునుఁగఁ
బగ లేదుటయు నెడఁబసు రథాంగము చంద
మునఁ జన్నులు ముఖోర్ధ్వముగ పడంక

గీ. పాణిముడలి నెఱపు వడి రొదలు
భ్రమణములతోడి పొత్తువిడిచి
లాఁతులైరి సఖులు లలితులు వాయని
ప్రాఁతలైరి విమధరాజ సుతకు. 54

సీ. మకరధ్వజుని విల్లు మనము వాయిని నిడి
సమలింపుగాఁ జేయు వల్లఁ జెలికి
మదను బాణావళి మనము క్రొమ్మొళ్లపైఁ
బోలుపారఁ జుటిమెడు పుష్పచయము
మనసిజాతుని మెల్లి మనము వినోదార్థ
మై వచ్చి యాడెడు మావిచిగురు
మరు తేరిహయములు మన యిండ్లలోఁ బంజ
రంబులఁ బోరలు కీరవ్రజంబు

గీ. తానసంగుఁ డట్టివాని యులంచుట
యేమి? యతని కడిమిదేమి? యతని
బీరమేమి? ధరణిఁ బిచ్చుక యులుకేమి
వాలఁగ... ... ...నేమి వాలుఁగంటి? 55

సీ. ఏపునఁ జెలరేఁగి యేయు మనోజన్ము
చెఱకువిల్ రెండుగా విఱిచివైతుఁ
బలువలై పలుకు చిల్కల నాలుకల ముల్లు
విఱిచి యారములలో వెడల నడఁతు
ముదమున మ్రోయుతుమ్మెదలఁ జంపక లతాం
తములలో మునుగంగ (నిముడింతుఁ)
దగులమై వీతెంచు దక్షిణాశాగంధ
వహు మహేంద్రుని వాతఁద్రోతు

గీ. నేటికలి కాదు నాయట్టి బోటికలుగ
చెలంది! నీమదిలోపల వెఱవకుండు
మమ్మ! ధైర్యంబు వదలకుమమ్మ యెంతేఁ
గ త్తలము గల్గమేనికిఁ గలదెబాధ. 56

### కీ. శే. బ్రహ్మశ్రీ సాహిత్యవిశారద

# కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

ఆంధ్రసాహిత్యపరిషదధ్యక్షులును సూర్యరాయాంధ్రనిఘంటు సంపాదకులును, పీఠికాపురసంస్థానవిద్వాంసులునగు బ్రహ్మశ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు 2-1-49 తేదీని మధ్యాహ్నము 2-30 గంటలకాకస్మికముగ దివంగతులైరి. వీరి మరణమువలన నాంధ్రసారస్వత ప్రపంచమునకు దీరనిలోటు వాటిల్లినది. ఆంధ్రలోకమున వీరిని వీరి సోదరులు సుప్రసిద్ధవిమర్శకులు నగు బ్రహ్మయ్యశాస్త్రివర్యులను దెలియనివా రుండరు. శ్రీ సుబ్బయ్యశాస్త్రిగారు పీఠికాపురకళాశాలయందు సంస్కృతపండితులై తమ పాండిత్యముచే శిష్యబృందమును రంజింప జేయుచుండిరి. వీరు పండితాగ్రేసరులగు శ్రీమాన్ మహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులు వారి ముఖ్యశిష్యులలో నొకరు. వీరికి సంస్కృతాంధ్రములలో విశేషపాండిత్యముండుటయేగాక సభలలో నెట్టి శ్రోతలకైనను రంజకముగ నుపన్యాసమునీయగల యనన్యసామాన్యమగు శక్తియుండెడిది. పండితులు, పామరులు, బాలురు, వృద్ధులు వారి యుపన్యాసమాధుర్యమును, వాక్నైపుణ్యమును గ్రోలి సంతసించుచుండిరి. రామాయణమహాభారతాది మహాగ్రంథములయందును కాళిదాసాదిమహాకవుల నాటకములయందును కావ్యనాటకలక్షణములు, రసపోషకత్వము మొదలగు విషయములగూర్చి శ్రీ శాస్త్రిగారి యుపన్యాసముల నొకపరి వినినచో మరలమరల వినగోరుచుందురు. అందును శ్రీ శాస్త్రిగారికి శ్రీమద్రామాయణమునందు భక్తిగౌరవము లధికము. కావ్యామృతరసాస్వాదనమే వీరి జీవితాశయము. డెబ్బదిరెండు సంవత్సరముల వయసునందియు శ్రీమద్రామాయణ పఠన

మున పాల్గొనుచు గ్రంథ్యములందలి విశేషముల నుగ్గడించుచు వీ రానందరసపూర్ణమనస్కులై సంలసింపుచుండిరి.

సంసారవిషవృక్షస్య ద్వేఫలే అమృతోపమే
కావ్యామృతరసాస్వాదః సల్లాపః సజ్జనైస్సహ

అనియు,

అద్విత్యస్యోదయం తాత సావర్ణం భారతీకథాః
ఇష్టాభార్యా సుమిత్రంచ అపూర్వాణి దినేదినే.

అనియు శ్రీ శాస్త్రిగారు పలుకుచూ తమ యుపన్యాసముల దెలుపుచుండిరి. పాశ్చాత్యనాగరికతా వ్యామోహమున బడి మన సారస్వత ప్రపంచమున నెట్టి విశేషములున్నవో తెలియక యాధునికులు కూపాంధన్యాయమున వర్తింపుచుండుట వీరు గర్హింపుచు, మన యపార సారస్వతసాగరమును మథించి యమృతాస్వాదన మొనర్పవలయు ననియు, సనాతనధర్మముల విడనాడవలదనియు హెచ్చరింపుచుండిరి.

వీరు శ్రీ రామచరితమందలి యాదరముచే సంస్కృతమున రామశతకమును వ్రాసి సోదరుల కంకితమొనర్చిరి. పెక్కు రామాయణగ్రంథముల పరిశోధించి శ్రీ రామవిజయము, శ్రావణవిజయము మొదలగు వచనగ్రంథములను, సాహిత్యకల యను విమర్శగ్రంథమును పెక్కు వ్యాసములను రచించి ప్రకటించియుండిరి. వీరి సంస్కృతాంధ్రపాండిత్యముల గమనించి శ్రీ శ్రీ పీఠికాపురాధీశ్వరులు తమ యాస్థానవిద్వాంసులుగ స్వీకరించుటయేగాక వీరిచే సూర్యరాయాంధ్ర నిఘంటువు మూడునాలుగు సంపుటములును, కళాపూర్ణోదయము, సింగభూపాలవిరచిత రత్నపాంచాలికానాటకాంధ్రీకరణమును, పానుగంటివారి యముద్రితనాటకములను, యింకను పెక్కుగ్రంథముల ప్రకటింపజేసిరి.

శ్రీ శాస్త్రిగారు కావ్యనాటకములు కళాశాలాశిష్యబృందముచే బఠింపఁజేయుటతో దృప్తినొందక, వారి మిత్రబృందము కోరికపై పెక్కుమాఱులు శాకుంతలము, ఉత్తరరామచరితము, మృచ్ఛకటిక నాటకము మొదలగు నాటకరత్నముల జదివి వారి నానందరసనిమగ్నుల గావించుచుండిరి.

శ్రీ జయంతి రామయ్యపంతులుగారు మృతినొందినతరువాత వీరాంధ్రసాహిత్యపరిషత్తున కధ్యక్షులై, తత్కార్యనిర్వహణమునదగు సహాయము నొనర్చుచుండిరి. వీరి పాండిత్యమున కాంధ్రవిద్వల్లోకము సాహిత్యవిశారద బిరుదమునొసంగి వీరిని బహూకరించినది. పత్రికలలో బ్రకటించు నొండురెండు వ్యాసములతో దృప్తినొందక శ్రీ శాస్త్రిగారు నిరంతరము సంస్కృతాంధ్రసాహిత్యవిషయములు ముచ్చటించుచు నాయాగ్రంథపఠనమునకై తమశ్రోతల బురికొల్పుచు సారస్వతసేవ నొనర్చి కృతకృత్యులైరి.

ఆంధ్రసారస్వతాభిమానులగు శ్రీ శాస్త్రిగారియొక్కయు వారి సోదరులయొక్కయు జీవితమునగల ముఖ్యవిషయముల గ్రహించి మనము సారస్వతసేవ నొనర్తుముగాక- శ్రీ శాస్త్రిగారి యాత్మకు పరమేశ్వరుడు శాంతి నొసంగుగాక-

---

# ఆంధ్రసాహిత్యపరిషత్తు



**1947—48**

## సర్వజిత్సంవత్సర ఆయవ్యయ
## పట్టిక.

# సర్వజిత్సంవత్సరము.

## ఆయవ్యయపట్టిక 1947—48.

| ఆదాయము. | | మొత్తము. |
|---|---|---|
| 1. సంవత్సరాది నిలువ | | 394- 4-8 |
| 2. బ్యాంకివడ్డీ:- | | 651- 6-0 |
| బొబ్బిలివారి వార్ బాండ్ మీద | 399-0-0 | |
| వేంకటగిరివారి గవర్నమెంటుపత్రము | 252-2-0 | |
| సేవింగ్సుబ్యాంకివడ్డి | 0-4-0 | |
| | 651-6-0 | |
| 3. పత్రికచందాలు | | 173- 0-0 |
| 4. ఇతరజమలు | | 2-13-3 |
| 5. పుస్తకవిక్రయము | | 1580- 8-9 |
| | | 2802- 0-8 |

| వ్యయము | మొత్తము. |
|---|---|
| 1. ఉద్యోగులజీతములు | 1332- 0-0 |
| 2. ఉద్యోగుల ప్రయాణ వ్యయము | 9- 0-0 |
| 3. పత్రికకు కాగితము | 75- 4-0 |
| 4. పత్రిక ముద్రణము | 255- 0-0 |
| 5. చిల్లర బైండింగు | 51-13-0 |
| 6. నిఘంటు బైండింగు | 620- 5-0 |
| 7 పత్రికలకు చందాలు | 48- 6-0 |
| 8. కొనినపుస్తకములు | 206-11-3 |
| 9. పోస్టువ్యయము | 24-12-6 |
| 10. సాదరు | 108- 4-0 |
| 11. సంవత్సరాంతమున నిలువ | 70-8-11 |
| | 2802-0-8 |

# పుస్తకవిక్రయము.

1. విప్రనారాయణ చరిత్రము 5- 8-3
2. జైమినిభారతము 10-13-9
3. యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము 7- 4-3
4 జ్యోతిశ్శాస్త్ర సారము 2- 5-6
5. సర్వేశ్వరశతకము 0- 8-3
6. కావ్యాలంకార చూడామణి 1- 5-0
7. అకారాద్యముద్రిత గ్రంథసూచిక 0-13-9
8. ప్రాకృతభాషోత్పత్తి 1- 6-6
9. శివతత్త్వసారము 1-15-6
10. చంద్రభాను చరిత్రము 8- 2-3
11. ఆర్యభాషావిభాగము 1- 6-0
12 హ్రాస్వరంగమాలు 0- 7-0
13 మన్నారుదాసవిలాస నాటకము 0- 8-0
14. కాళిందీకన్యాపరిణయము 1 6- 4-0
15. డిటో 11 భా 3- 8-9
16. ఆంధ్రధాతుమాల 6-13-6
17. శాసనపద్యమంజరి 1 భా 10- 8-3
18. డిటో 11 భా 0-14-0
19. శతకసముచ్చయము 1 2- 9-9
20. డిటో 11 2- 2-6
21. పరిషత్పుస్తకభాండాగారము 11 భా 1-11-9
22. డిటో 111 0-14-0
23. సూత్రాంధ్రవ్యాకరణము 2-11-9
24. రసాభరణము 4- 0-9
25 ఆంధ్రశబ్దచింతామణి 8- 7-9
26 షోడశకుమారచరిత్రము 4- 0-3
27. హంససందేశము 0- 7-3
28 రాజవాచకము 2- 4-0
29 సింహాసనద్వాత్రింశిక 1 భా 5- 3-9
30. డిటో 11 భా 5- 3-9
31. నిఘంటుచరిత్రము 0-11-3
32. ఆంధ్రకౌముది 2- 9-9
33 బాలభారతము 1-15-6
34. Dravidian Lexicography 1- 3-0
35. Defence of literary Telugu 1-6-0
36. చాటుధారాచమత్కారసారః 1- 6-9
37. సాంబోపాఖ్యానము 8- 0-3

| | |
|---|---|
| 38. రసార్ణవాలంకారము | 1-13-0 |
| 39. కవిజనోజ్జీవనిసమస్యలు | 1- 2-6 |
| 40. రఘునాథరామాయణము | 3- 2-0 |
| 41. రజతోత్సవసంపుటము | 7- 0-9 |
| 42. ఆంధ్రసాహిత్యపరిషత్సవృత్తాంతము | 1- 5-0 |
| 43. అరవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము | 1- 9-6 |
| 44. లక్షణసారసంగ్రహము | 0-15-0 |
| 45. లౌకికన్యాయవివరణము | 0- 7-3 |
| 46. కావ్యాలంకారచూడామణిపాఠభేదములు | 1-12-0 |
| 47. సీతారామచరిత్రము | 4-13-0 |
| 48. ఉత్తరరామచరిత్రము | 17-11-3 |
| 49. అమరుకము | 4- 7-3 |
| 50 ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి | 4-10-0 |
| 51. శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు 1 వ భాగము | 378-14-6 |
| 52. డిటో 2 | 299- 1-3 |
| 53. డిటో 3 | 312- 1-3 |
| 54. డిటో 4 | 325- 9-0 |
| | 1494- 0-9 |

కిళాంబి రాఘవాచార్యులు,

వింజమూరి వెంకన్నపంతులు,

కార్యదర్శులు.

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు



## 1948–49

## సర్వధారి సంవత్సర ఆయవ్యయ పట్టిక.

# సర్వధారి సంవత్సరము (1948—49)

## ఆయవ్యయపట్టిక.

| ఆయము. | | మొత్తము. |
|---|---|---|
| 1. సంవత్సరాది నిలువ | | 70- 8-11 |
| 2. బ్యాంకివడ్డి | | |
| శ్రీ బొబ్బిలిమహారాజా రు-అ పై వారిపత్రములవలన | 399-0-0 | |
| శ్రీ వేంకటగిరిమహారాజావారిపత్రమువలన | 196-0-0 | |
| సేవింగ్సుబ్యాంకివడ్డి | 0-3-0 | |
| | 595-3-0 | 595- 3- 0 |
| 3. పత్రికచందాలు | | 64- 8-0 |
| 4. చిల్లరజమలు | | 1- 6-9 |
| 5. పుస్తకవిక్రయము | | 1298-11-6 |
| 6 చేబదుళ్లు | | 200- 0-0 |
| | మొత్తము | 2230- 6-2 |

| | |
|---|---|
| 1. ఉద్యోగులజీతములు | 871- 8-0 |
| 2. ఉద్యోగుల ప్రయాణవ్యయములు | 30- 0-0 |
| 3. పత్రికకాగితము | 3[illegible]-11-9 |
| 4. పత్రికముద్రణము | 158- 0-0 |
| 5. చిల్లర బైండింగు | 30- 4-0 |
| 6. నిఘంటుబైండింగు | 380- 4-0 |
| 7. పత్రికలకుచందాలు | 87-14-0 |
| 8. కొనిన పుస్తకములు | 114- 1-6 |
| 9. పోస్టువ్యయములు | 21-15-0 |
| 10. చేబదుళ్లుతీర్చినవి | 255- 8-0 |
| 11. సాదరు | 11- 9-9 |
| 12. సంవత్సరాంతమున నిలువ | 238-10-2 |
| మొత్తము | 2230- 6-2 |

# పుస్తకవిక్రయము. 1948-49 సర్వధారిసంవత్సరము.

| వివరము. | మొత్తము. |
| --- | --- |
| 1. విప్రనారాయణచరిత్రము | 3-14-0 |
| 2. జైమినిభారతము | 8- 4-6 |
| 3. యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | 14- 1-9 |
| 4. సర్వేశ్వరశతకము | 0- 6-0 |
| 5. కావ్యాలంకార చూడామణి | 1-15-0 |
| 6. ప్రాకృతభాషోత్పత్తి | 1- 8-0 |
| 7. శివతత్వసారము | 3- 8-0 |
| 8. చంద్రభానుచరిత్రము | 4- 8-0 |
| 9. శివరాత్రిమాహాత్మ్యము | 0-12-0 |
| 10. ఆర్యభాషావిభాగము | 2-12-0 |
| 11. హరిప్రరంగములు | 0- 8-0 |
| 12. నారసింహపురాణము | 2- 0-3 |
| 13 మన్నారుదాసవిలాసనాటకము | 1-14-3 |
| 14. కాళిందీకన్యాపరిణయము 1 భాగము | 5- 8-0 |
| 15. డిటో 2 ,, | 1- 7-0 |
| 16. రెడ్డిరాణీరెండు శాసనములు | 0- 8-0 |
| 17. ఆంధ్రధాతుమాల | 1- 8-0 |
| 18. శాసనపద్యమంజరి 1 భాగము | 28-15-6 |
| 19. డిటో 2 ,, | 1-15-0 |
| 20. సూత్రాంధ్రవ్యాకరణము | 0- 8-0 |
| 21. రసాభరణము | 1- 0-0 |
| 22. షోడశకుమార చరిత్రము | 3- 4-0 |
| 23. సింహాసనద్వాత్రింశిక 1 భాగము | 2- 8-0 |
| | 92-12-3 |

## పుస్తకవిక్రయము. 1948-49 సర్వధారిసంవత్సరము.

| వివరము. | | | మొత్తము |
|---|---|---|---|
| | | రూ॥ | 92-12- |
| 24. సింహాసనద్వాత్రింశిక 2 భాగము | | | 2- 3- |
| 25. ఆంధ్రకౌముది | | | 1- 8-0 |
| 26. బాలభారతము | | | 0-12-0 |
| 27. Dravidian Lexicography | | | 0- 4-0 |
| 28. సాంబోపాఖ్యానము | | | 4-10-0 |
| 29. కవిజనోజ్జీవనిసమస్యలు | | | 0- 8-0 |
| 30. రఘునాథరామాయణము | | | 0- 7-0 |
| 31. రజతోత్సవసంపుటము | | | 11- 0-0 |
| 32. అరవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము | | | 0- 4-0 |
| 33. లక్షణసారసంగ్రహము | | | 0- 8-0 |
| 34. లౌకికన్యాయవివరణమాలు | | | 2- 4-0 |
| 35. ఉత్తరరామచరితము | | | 1- 0-0 |
| 36. అమరుకము | | | 2- 0-0 |
| 37. చంపూరామాయణము | | | 1- 0-0 |
| 38. ఆధునికాంధ్రవాఙ్మయ వికాసవైఖరి | | | 2- 0-0 |
| 39. శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు 1 భాగము | | | 349- 4-0 |
| 40. డిటో | 2 | ,, | 270-12-0 |
| 41. డిటో | 3 | ,, | 277- 8-6 |
| 42. డిటో | 4 | ,, | 277- 8-6 |
| 43. విడిసంచికలు | | | 0-10-0 |
| | | | 1298-11-6 |




నాంబి రాఘవాచార్యులు,
వింజమూరి వెంకన్నపంతులు,
కార్యదర్శులు.